యోజన = సం. యోచన; సంబంధము
యోజనము = సం. ఆమడ; కూర్పు
యోజించు = సం. ఆలోచించు; కూర్చు; చేర్చు; ధ్యానించు
యోధుఁడు = సం. యుద్ధముచేయు వాఁడు; శూరుఁడు; బంటు
యోని = సం. భగము; ఆఁడుగుఱి; కారణము; గని
యోని సంబంధము = సం. వివాహము వలన సంబంధము; రక్త సంబంధము
యోష = సం. స్త్రీ; వనిత
యోషాప్రియ = సం. పసుపు
యోషిత = యోష
యోషిత్తు = యోషిత



యౌగికము=సం. యోగము వలన కలిగినది
యౌతకము=సం.అరణము
యౌథికుఁడు = సం. స్నేహితుఁడు
యౌవతము=సం. యువతీ సమూహము
యౌవనము=సం. మంచి ప్రాయము
యౌష్ణ్యము=సం. స్త్రీధర్మము; స్త్రీత్వము; ఆఁడుతనము



రంకువు = సం. ఒక జాతి లేడి
రంగఁడు= త. శ్రీ రంగనాథుఁడు
రంగము = దే. సోడె
రంగము = సం. తగరము; యుద్ధభూమి; నాట్యస్థానము; శ్రీరంగము
రంగవల్లి = సం. ముగ్గు
రంగు = త. వర్ణము; కాంతి
రంగుగా = త. సొంపుగా
రంజకము = సం. ఆనందింపజేయునది
రంజనము = సం. ఆనందపఱచునది
రంజిల్లు =సం. ఎఱ్ఱనగు; అనురాగము పొందు
రంజేణి = దే. గంగాళము
రండ = సం. విధవ; అంకుటాలు
రంత = సం. క్రీడించువాఁడు; రమించు వాఁడు
రంతిదేవము = సం. కుక్క
రంతు = సం. రతి; క్రీడ; కామకేళి
రంతుకాఁడు = ద్వ. క్రీడాపరుఁడు
రంధి = దే. చేటు; పోరు
రంధ్రము = సం. బెజ్జము; సందు
రంధ్రాన్వేషి=సం. తప్పులు వెదకువాఁడు
రంపె = దే. మాదిగవాఁడు తోలుకోసెడు సాధన విశేషము
రంపెలాఁడి =దే. రాక్షస కృత్యముగల ఆఁడుది
రంభ=సం. ఒకానొక అప్సర స్త్రీ; అరఁటిచెట్టు
రక్కసుఁడు = త. రాక్షసుఁడు; నైరృతి
రక్కసుల గొంగ= ద్వ. విష్ణువు
రక్త తుండము = సం. చిలుక
రక్త దృక్కు = సం. పావురము
రక్తనాసిక = సం. గ్రుడ్లగూబ
రక్తప = సం. జెలగ
రక్తపాయి=సం. నల్లి
రక్తపుచ్ఛిక = సం. నలికండ్లపాము
రక్తము = సం. నెత్తురు; కుంకుమ; కుంకుమ పువ్వు; రాగి; ఎఱుపు; ఎఱ్ఱనిది; అనురాగము కలది
రక్తాక్షి = సం. ఒక సంవత్సరము
రక్తి = సం. రాగము; అనురాగము; శ్రావ్యత; గానమాధుర్యము
రక్ష =సం. రక్షణము; లక్క; వాఁత; రక్షణకై బిడ్డలకు గట్టెడు సాధనము; నొసటబెట్టుకొను హోమభస్మము
రక్షస్సు = సం. రాక్షసుఁడు; పిశాచము
రగడ =సం. పద్యభేదము; శ్రావ్యత; పోరు
రగులు = దే. బండు; మంటయెత్తు
రచన = సం. నిర్మాణము; ఏర్పాటు; గ్రంథ రచన

రచించు=సం. నిర్మించు; పన్ను
రచ్చే = త. రాజమార్గము; మండపము; సభ; గోష్ఠి; కలకలము; కలహము
రచ్చెగొమ=ద్వ. గుంపుగూడు
రజక = సం. చాకలది
రజకుఁడు = సం. చాకలివాఁడు
రజతము = సం. వెండి; హారము; ఏనుఁగు కొమ్ము; తెల్లనిది
రజని = సం.రాత్రి; పసుపు
రజనీచరుఁడు = సం. రాక్షసుఁడు
రజ్జువు = సం. త్రాడు; దారము
రజ్జో=దే. ప్రేలు; వదరు; వ్యర్థభాషణము
రట్టు = త. ఉపద్రవము
రణము = సం. యుద్ధము; ధ్వని
రతము = సం. సురతము; ఆఁడుగుఱి
రతి = సం. సురతము; మన్మథుని భార్య; అనురాగము; ఆఁడుగుఱి
రత్నాకరము=సం. సముద్రము
రథకారుడు=సం. వడ్రంగి; రథము చేయు వాఁడు
రథికుడు = సం. రథము కలవాఁడు; రథము నెక్కి యుద్ధము చేయు వాఁడు
రథ్య=సం. రాజమార్గము; రథసమూహము
రమణి = సం. ఆఁడుది; సుందరి; భార్య
రమణీయము = సం. మనోహరమైనది; ఒప్పిదమైనది
రమణుఁడు = సం. భర్త; మన్మథుఁడు
రమించు = సం. క్రీడించు; సంభోగించు
రమ్య = సం. రాత్రి
రమ్యము=సం. ఒప్పిదమైనది; సంపెంగ చెట్టు
రయము = సం. వేగము; ప్రవాహము
రవము = సం. ధ్వని; కంఠధ్వని
రవి = సం. సూర్యుఁడు
రశ్మి=సం. వెలుఁగు; కిరణము; పగ్గము; ఱెప్ప
రసన = సం. నాలుక; మొలనూలు
రసము = సం. ప్రేమ; ద్రవము; పాదరసము; జలము
రసవాదము = సం. బంగారం చేసెడి విద్య
రసాభాసము =సం. చెడగొట్టుట; విరసము
రసాలము = సం. మామిడిచెట్టు; చెఱకు
రహి = సం. అందము; ఆనందము; రక్తి ఆసక్తి



రా = దే. రమ్ము
రాఁజో=దే. నిప్పు అంటుకొను; ప్రజ్వరిల్లు
రాక = సం. పూర్ణిమ; తీఁట; సమర్తాడిన
రాగము = సం. ఎఱుపు; ప్రీతి
రాగి = సం. రాగముకలది
రాజయక్ష్మము = సం. క్షయరోగము
రాజయోగము = సం. మంచి గ్రహస్థితి
రాజి = సం. రేఖ; పంక్తి; సమూహము
రాజ్ఞి = సం. రాణి
రాట్ = సం. ప్రభువు; చంద్రుఁడు
రాటు = త. ఉపద్రవము; జనసమ్మర్దము
రాణ = త. ప్రీతి; విధము
రాణించు = త. ఒప్పు; శోభించు
రాణువ = దే. పరివారము; సేన
రాత్రించరుఁడు = సం. రాక్షసుఁడు
రాపులుఁగు = ద్వ. రాబందు
రామ = సం. ఆఁడుది
రామానుజకూటము = సం. వైష్ణవుల కైన సత్రము
రామబారి = ద్వ. దూత; రాయబారము చేయువాఁడు
రావణము = సం. పెద్ద అఱుపు; ఏడ్పుట
రావము = సం. ధ్వని; రవము
రాష్ట్రము = సం. దేశము; ఉపద్రవము
రాసభము = సం. గాడిద; ఖరము
రాహుత్తుఁడు = సం. గుఱ్ఱపురౌతు

రాహువు = సం. ఒక ఛాయాగ్రహము

## రి

రింఖ = సం. గుఱ్ఱపుడెక్క; నృత్యము
రింఖణము = సం. జాఱుట; స్ఖలనము
రించోళి = సం. సమూహము
రిక్క = త. నక్షత్రము
రిక్తుఁడు = సం. దరిద్రుఁడు
రిత్త = త. వట్టి; కల్ల
రిత్తవోవు = ద్వ. వ్యర్థమగు
రిపువు = సం. శత్రువు; అరి; పగతుఁడు
రిమ్మ = దే. ఉన్మాదము
రిరంస = సం. రమింపనిచ్ఛ

## రీ

రీణము = సం. స్రవించునది; కాఱినది
రీతి = సం. విధము; ప్రవాహము

## రు

రుంజె = దే. ఒక చర్మవాద్యము
రుక్కు = సం. కిరణము; కాంతి; ఇచ్ఛ
రుగ్మత = సం. రోగము
రుచించు = సం. ఇష్టమగు
రుచిరము = సం. రుచిగలది; ఒప్పిదమైనది
రుజ = సం. రోగము; బాధ
రుజావు=హిం. సాక్ష్యము; దృష్టాంతము
రుద్రుఁడు = సం. శివుఁడు
రుధిరము = సం. నెత్తురు
రువ్వు = దే. విసరివైచు
రుష = సం. కోపము; కినుక

## రూ

రూక = త. ధనము; ఒక నాణెము
రూఢము = సం. ప్రసిద్ధికెక్కినది; విశ్వ యింపబడినది
రూపము = సం. ఆకారము; సౌందర్యము; ప్రతిబింబము
రూపుమాయు = ద్వ. నశించు; చెఱచు

## రె

రెంటము = దే. చర్మము; మడువు
రెక్కొను = దే. తేఱుకొను; వర్థిల్లు
రెచ్చు = దే. విజృంభించు
రెట్ట = దే. భుజము; పక్షిమలము
రెమ్మ = దే. చిన్నకొమ్మ; ఉపశాఖ

## రే

రే = త. రేయి
రేఁగు = దే. ఉద్రేకించు; ఒక చెట్టు
రేఁచు = దే. రేఁగఁజేయు
రేక = త. రేఖ; పంక్తి; గీఱ
రేచీఁకటి = దే. రాత్రి కన్ను తెలియమి; నిశాంధ్యము
రేణువు=సం. నలక; దుమ్ము
రేతస్సు =సం. ఇంద్రియము; పాదరసము
రేపు = దే. మఱుసటి దినము; ప్రాతః కాలము
రేయెండ = ద్వ. వెన్నెల
రేష = సం. అఱవు

## రై

రై = సం. ధ్వని; ధనము; బంగారము
రైతు = దే. కృషీవలుఁడు; పంటకాఁపు
రైవతము = సం. ఒక పర్వతము

## రొ

రొండి = దే. నడుము ప్రక్కభాగము
రొంపి = దే. బురద; అడుసు
రొక్కము = త. ధనము; సమూహము
రొష్టు = దే. బాధ; రోఁత; తొందర

## రో

రో = సం. ధనము; వెల

రోఁజు = దే. నిట్టూర్పు
రోఁత=దే. జుగుప్స; ఏవము; అపవాదము
రోగము = సం. వ్యాధి; తెవులు
రోగాయతనము = సం. శరీరము
రోచకము= సం.ఆఁకలి పుట్టించునది; కాంతి
రోచనము = సం. ప్రకాశించునది
రోచిస్సు=సం. వెలుఁగు; సూర్యకిరణము
రోదనము = సం. ఏడ్పు; కన్నీరు
రోదసి = సం. ఆకాశము; గగనము; వ్యోమము
రోమము = సం. వెంట్రుక
రోమాంచము = సం. గగుర్పాటు
రోయి=సం. చేబదులు; ఎరవు; పందెము; కుదువ
రోయు = దే. వెదకు; నిందించు; రోఁతపడు
రోషము = సం. కోపము; కినుక
రోహితము = సం. నెత్తురు; ఎఱ్ఱనిది

## రౌ

రౌద్రము =సం. భయంకరము; తీక్ష్ణము; ఎండ
రౌప్యము = సం. రూప్యము
రౌరవము = సం. ఒక నరకము; భయంకరము
రౌహిషము = సం. కొండగొఱ్ఱె; కామంచి మొక్క

## ఱ

ఱంకాట = ద్వ. జారత్వము చేయుట
ఱంకాడు = ద్వ. జారత్వముచేయు
ఱంకు = త. జారత్వము
ఱంకుఁబోతు = ద్వ. జారుఁడు; జారిణి
ఱంకుటాలు = ద్వ. జారిణి
ఱంకుతెవులు = ద్వ. మేహరోగము
ఱంకుమగఁడు = ద్వ. జారుఁడు
ఱంకులరాట్నము = త. బాలకులను వేడుకకై ఎక్కించి త్రిప్పెడు వలయాకారపు యంత్ర విశేషము
ఱంకులాఁడి = ద్వ. జారిణి
ఱంకె = దే. కేక; ఎద్దు అఱపు
ఱంకెత = ద్వ. జారిణి
ఱంతు = దే. గోల; రొద; కలకలధ్వని
ఱంపిలు = దే. వ్యాపించు; వర్ధిల్లు అతిశయించు
ఱట్టు = దే. అపకీర్తి; నింద; దూఱు
ఱవిక = దే. రవిక
ఱవ్వ = దే. అపకీర్తి; నింద

## ఱా

ఱా = దే. ఱాయి
ఱాఁగ = త. ధూర్తుఁడు; ధూర్తురాలు; జారిణి
ఱాచు = దే. రుద్దు; రాపుడుచేయు
ఱాపు = దే. రాయిడి; అదుముడు

## ఱి

ఱిక్క = దే. పశువులకాచునప్పటి ధ్వని
ఱిక్కించు = దే. నిక్కించు
ఱిచ్చ= దే. విశ్చేష్టత
ఱివ్వన= దే. శీఘ్రముగ

## ఱు

ఱువ్వు = దే. విసరివైచు

## ఱె

ఱెప్పపాటు = ద్వ. క్షణకాలము;
ఱెల్లు = దే. ఒక తృణము

## ఱే

ఱేచు = దే. ఒక జాతికుక్క
ఱేఁడు = దే. రాజు; మగఁడు

తేకు = దే. పుష్పదళము; ఈఁక
తేకెత్తు = దే. వృద్ధిపొందు
తేపకడ = దే. ప్రాతఃకాలము
తేపు = దే. మఱునటి దినము; ప్రాతఃకాలము

## తౌ

తౌచ్చె = దే. బురద; తిరస్కారము; సందడి
తౌడ్డు = దే. అధికము
తౌమ్ము = దే. రొమ్ము; వక్షము

## ల

లంక = దే. దీవి; తలవాఁకిటి ప్రక్క గది
లంక = సం. రావణుని పట్టణము; ఒక రాక్షసి; అంకుటాలు
లంకణము = త. ఉపవాసము
లంకించే = త. అవమానించే; తగులు; పెనవేయు
లంకె = త. సంబంధము; పెనఁసంగమము
లంఘనము = సం. దాఁటుట; ముట్టడించుట; లంకణము
లంఘించు = సం. దాఁటు; దూఁకు
లండు = దే. కుజనుఁడు
లంపటము = దే. శ్రమ; ఆపద
లక్షించే = సం. గుఱిచేయు; చూచే
లక్షితము = సం. చూడఁబడినది
లక్ష్మము = సం. గుఱుతు; ముఖ్యము
లక్ష్మి = సం. రమ; సంపద
లక్ష్మీపతి = సం. విష్ణువు; ప్రభువు
లక్ష్యము = సం. గుఱి; చూడఁదగినది
లగ్గు = దే. శుభము; మేలు; ఉత్తరక్రియ
లగ్నము = సం. సుముహూర్తము; మదపు టేనుగు
లఘువు = సం. చేలుకనిది; ఒప్పిదమైనది
లఘుశంక = సం. మూత్రము
లచ్చి = త. లక్ష్మి; సంపద
లజ్జ = సం. సిగ్గు
లడాయి = హిం. యుద్ధము; జగడము
లత = సం. తీఁగ; చీమ; గతిక
లబ్ధము = సం. పొందబడినది
లబ్ధి = సం. లాభము; ప్రాప్తి; కలిమి
లభ్యము = సం. లభింపదగినది
లయము = సం. నాశము; ఆలింగనము
లలన = సం. ఆఁడుది; నాలుక
లలాటము = సం. నొసలు; నుదురు
లలి = దే. ప్రేమ; వికాసము; ఉత్సాహము
లవణము = సం. ఉప్పు; ఉప్పునిది
లవలి = సం. వెన్నెలతీఁగ
లవిత్రము = సం. కొడవలి
లహరి = సం. పెద్దఅల; ప్రవాహము

## లా

లాంగలము = సం. నాఁగలి; మగగుఱి
లాంగూలము = సం. తోఁక; మగగుఱి
లాఁగ = దే. బిలము; కన్నము
లాఁతి = దే. ఇతరము; పెఱ
లాక్ష = సం. లక్క; ఆరుద్ర పురుగు
లాఘవము = సం. తేలిక; అవమానము; ఆరోగ్యము
లాజలు = సం. పేలాలు; బొరుగులు
లాడము = దే. గుఱ్ఱముల పశువుల గొరిజ (గిట్ట)లకు కొట్టెడి ఇనుప తగటి బిళ్ళ; నాళము; లాళము
లాయము = త. అశ్వశాల
లాలనము = సం. బుజ్జగించుట; లాలించుట
లాలస = సం. అధికేచ్ఛ; యాచన; విషయాసక్తురాలు
లాలసుఁడు = సం. ఆసక్తుఁడు
లాలించే = సం. బుజ్జగించే
లావణ్యము = సం. చక్కఁదనము
లావరి = దే. బలవంతుఁడు; బలవంతురాలు
లాసకము = సం. నెమలి

లాహిరి = దే. మైకము

**లి**

లింగనము = సం. కౌఁగిలించుకొనుట
లింగము = సం. గుఱుతు; వేషము; మగగుఱి; అనుమానము
లింగవృత్తి = సం. మోసగాఁడు
లికుచము = సం. గజనిమ్మచెట్టు
లిఖించు = సం. వ్రాయు; గీయు
లిఖితము = సం. వ్రాయబడినది

**లీ**

లీనము = సం. అంతర్ధానము; కరఁగినది
లీల = సం. క్రీడ; ఆట; విలాసము; శృంగారచేష్ట
లీలాశుకము = సం. పెంపుడుచిలుక

**లు**

లుంగ = దే. బట్టలమోపు
లుప్తము = సం. లోపించినది
లుబ్ధకుఁడు = సం. పిసినివాఁడు; బోయువాఁడు
లులాయము = సం. దున్నపోతు

**లూ**

లూత = సం. సాలెపురుగు; చీమ

**లె**

లెంక = దే. భటుఁడు; సేవకుఁడు
లెస్స = దే. క్షేమము; శ్రేష్ఠము

**లే**

లేఁగ = దే. దూడ
లేఁగొను = దే. నడుము
లేక = త. జాబు; సమూహము
లేకరి = ద్వ. వ్రాఁతకాఁడు
లేకి = దే. అప్రయోజకుడు
లేఖ = సం. జాబు; లిపి
లేఖకుఁడు = సం. వ్రాఁతకాఁడు
లేఖనము = సం. వ్రాఁత; వాంతి
లేఖిని = సం. వ్రాసెడు కలము
లేఖుఁడు = సం. దేవత; వేలుపు
లేటమొగము=దే. అయిష్టము; అప్రియము
లేమ = త. ఆఁడుది; లేఁత
లేమి=దే. దారిద్ర్యము; కలుగమి
లేశము = సం. కొంచెము; అణువు

**లొ**

లొంగు = దే. లోఁబడు; వెనుదీయు
లొంప = దే. కొంప; అల్పగృహము
లొటారము=దే. బొక్క; శూన్యము; బిలము
లొటిపిట్ట = ద్వ. ఒంటె; ఉష్ట్రము
లొట్టపోవు = దే. అణఁగు
లొడలొడ = దే. వదులు
లొద్ది =దే. లోయ

**లో**

లోఁగడ = దే. పూర్వము; అంతరాళము
లోఁగిలి = ద్వ. ఇల్లు; గృహాంతర్భాగము
లోఁగు = దే. లోఁకువగు; వెనుదీయు
లోఁగొను=దే. సత్కరించు; లోనికి దీసికొను
లోకమాత = సం. లక్ష్మి
లోకము = దే. జగము; జనము
లోకులు = దే. జనులు
లోచనము = సం. కన్ను; నేత్రము
లోభము = సం. పిసినితనము; అత్యాశ
లోభి = సం. పిసినవాఁడు
లోమము = సం. రోమము
లోహము = సం. ఇనుము
లోహితము = సం. నెత్తురు; ఎఱుపు

**లౌ**

లౌకికము = సం. లోకసంబంధమైనది

లౌకికుఁడు = సం. లోకజ్ఞుఁడు
లౌక్యము = సం. లోకసంబంధమైనది
లౌక్యుఁడు = లోకసంబంధముకలవాఁడు
లౌడి = త. దుడ్డుకఱ్ఱ; పరిఘము
లౌల్యము = సం. లోలత్వము; ఆశ
లౌహిత్యము = సం. ఎఱ్ఱన; ఎఱుపు

## వ

వంక = త. వంకర; వాఁగు
వంక=దే. దిక్కు; సాకు; వైపు; పక్షము
వంగడము = త. వంశము; కులము
వంచకము =సం. నక్క; ఊరముంగిస
వంచన = సం. మోసము
వంజే = త. గొడ్రాలు; గొడ్డుటావు
వంత=దే. ఏడ్పు; బాధ; పంతాపము
వందనము = సం. నమస్కారము; స్తుతి
వంద్యుఁడు = సం. పూజ్యుఁడు; స్తుతింపఁదగినవాఁడు
వంధ్య = సం. గొడ్రాలు; గొడ్డుటావు
వంధ్యము = సం. ఫలింపనిది; నిరుపయోగమైనది
వంశము=సం. కులము; సమూహము
వంశి = సం. పిల్లనగ్రోవి
వకుళము = సం. పొగడచెట్టు
వక్కి = దే. బక్క
వక్తవ్యము =సం. మాట; మాటాడఁదగినది
వక్త్రము = సం. నోరు; ముఖము
వక్రిమ = సం. వంకర; వంగినది
వక్షము = సం. ఱొమ్ము
వక్షోజము = సం. స్తనము; కుచము
వగచే = దే. విచారించే; శోకించే
వగపు = సం. విచారము; శోకము
వజ్రి = సం. ఇంద్రుఁడు
వటువు = బ్రహ్మచారి; బాలకుఁడు
వట్ట = దే. వృషణము
వట్రువ = త. గుండ్రము
వట్రువవాలు = దే. విష్ణుచక్రము
వడముడి = దే. భీముఁడు
వడి =దే. వేగము; శౌర్యము; కాలము
వడుగు = దే. విధము
వడుగు =త. బ్రహ్మచారి; ఉపనయనము
వడువు = దే. వడియుట
వణిజుఁడు = వర్తకుఁడు
వత్సము = సం. ఱొమ్ము; దూడ
వత్సరము = సం. సంవత్సరము
వదనము = సం. నోరు; ముఖము
వదాన్యత = సం. దాతృత్వము
వదాన్యుడు = సం. దాత; మిక్కిలి ఇచ్చేవాఁడు
వధువు = సం. ఆఁడుది; పెండ్లాము; పెండ్లికూఁతురు
వధూనిక = సం. వదినె
వధ్యుఁడు = సం. చంపదగినవాఁడు
వనదము = సం మేఘము
వనధి = సం. సముద్రము
వనమాలి = సం. విష్ణువు; వనమాలగలవాఁడు
వనము = సం. అడవి; తోఁట; నీరు
వనరు = సం. శోకించే; సొత్తు
వనస్పతి = సం. చెట్టు
వనిత = సం. ఆఁడుది; యాచింపబడినది
వనేచరము = సం. వానరము
వన్నియ = త. అందము; వన్నె
వన్నెకత్తె = త. సౌందర్యవతి; విలాసవతి
వన్యము = సం. అడవియందు బుట్టినది
వపనము = సం. గొఱుగుట
వమనము = సం. వాంతి; పీడనము
వయస్య = సం. చెలికత్తె
వయాళి = త. విహారము; స్వారి
వరపుడము = త. దాస్యము
వరాకము = సం. అధమము
వరాటకము=సం. గవ్వ; తామరపూస

వరాహము = సం.పంది; వరహా; కొండ
వరాహుఁడు = సం. విష్ణువు
వరుఁడు = సం. పెండ్లికొడుకు; శ్రేష్ఠుఁడు; మగఁడు; ఱేఁడు
వరుమానము =దే. ఆదాయము; రాబడి
వరూథిని = సం. సేన; దండు
వర్చస్సు = సం. తేజము; రూపము
వర్జ్యము = సం. విడువదగినది
వర్ణము =సం. అక్షరము; రంగు; కులము
వర్తనము =సం. నడవడి; జీవనము; స్థితి
వర్తమానము = సం. సమాచారము; జరుగుచున్న కాలము
వర్తించే = సం. ఉండు
వర్ధనము = సం. పెరుఁగుట; పెరుఁగునది
వర్ధమానము = సం. వృద్ధిపొందింప బడినది
వర్ధమానుఁడు = సం. విష్ణువు; వృద్ధి పొందువాఁడు
వర్ధిల్లు = సం. వృద్ధిపొందు
వర్షము = సం. వాన; సంవత్సరము; వేడితనము
వఱగొడ్డము =ద్వ. వంకరమాట
వఱడు = దే. నక్క; ముదినక్క
వఱపు = దే. వానలేమి
వఱలు = సం. ప్రకాశించే; వ్యాపించే
వఱువాత= త. ప్రాతఃకాలమున
వఱ్ఱు = దే. ప్రవాహము
వలఁతి = దే. ఆఁడుది; నేర్పరి; అధీనము; అనుకూలము
వలగొను = దే. ప్రదక్షిణముచేయు
వలగ్నము = సం. నడుము
వలచే = త. కోరు; కామించే
వలను = దే. దిక్కు; ఉపాయము
వలపల = దే. దక్షిణభాగము
వలపు = త. కోరిక; కామము
వలమురి = దే. దక్షిణావర్తశంఖము
వలమురితాలుపు=దే. విష్ణువు; శంఖపాణి
వలయితము = సం. చుట్టబడినది
వలరాజా = త. మన్మథుఁడు
వలాహకము = మేఘము; పర్వతము
వలి = దే. శీతము; గొప్ప; కంపము
వలిగొను = దే. చలిగొను; వణఁకు
వలిపము = దే. తెల్లనివస్త్రము; మడుఁగు వస్త్రము
వలిమల =ద్వ. మంచుకొండ; శీతనగము
వలీముఖము = సం. వానరము
వలువ = దే. సన్న వస్త్రము; వస్త్రము
వల్మీకము = సం. పుట్ట
వల్లకాడు = ద్వ. శ్మశానము
వల్లభ = సం. ప్రియురాలు
వల్లభుఁడు = సం. ప్రియుఁడు; మగఁ ప్రభువు
వల్లి = సం. తీఁగ; లత
వల్లించే = దే. కంఠపాఠముచేయు
వశవర్తి = సం. విధేయుఁడు
వశీకరణము=సం. లోఁబఱచుకొనుట
వసంతదూతము=సం. కోయిల; తియ్య మామిడి
వసితాఁకు = దే. గొప్పదెబ్బ
వసుధ = సం. భూమి
వహిత్రము = సం. తెప్ప; పడవ
వహేలము = సం. తిరస్కారము; తెగడిక
వహ్ని = సం. అగ్ని; జీర్ణశక్తి

## వా

వా = త. నోరు; ఖడ్గధార
వాంఛ = సం. కోరిక; ఇచ్ఛ
వాంతి = సం. వమనము
వాఁక = త. ఏఱు; వంకర
వాఁగు =త. వరదరు; సెలయేఱు; సైన్యము
వాఁడి = దే. పదను; పదనైనది
వాఁడిమగడు = దే. శూరుఁడు
వాఁడిమి = దే. తేజము; పదను; శౌర్యము

వాకు = సం. వాక్కు; మాట
వాకొను = దే. మాటాడు; అఱచే
వాక్పతి =సం. బ్రహ్మ; బృహస్పతి
వాక్రుచ్చే = ద్వ. చెప్పు; పేరుచెప్పు
వాగుర = సం. వల; ఉరి
వాగ్దేవత = సం. సరస్వతి
వాఙ్మయము = సం. సారస్వతము
వాఙ్మూలము=సం. వాగ్రూపముగా చెప్పునది
వాచాలుఁడు = సం. వదరు బోతు
వాచ్యము = సం. చెప్పదగినది; నిందింపదగినది
వాజి = సం. గుఱ్ఱము; పక్షి; బాణము
వాటి = సం. తోఁట; ప్రదేశము
వాడుక = దే. ఉపయోగము; అభ్యాసము; వ్యవహారము
వాతాయనము = సం. కిటికి; గవాక్షము
వాతాశి = సం. పాము
వాతులము = సం. గాలి; సుడిగాలి
వాత్సల్యము=సం. పిల్లలయందు గల స్నేహము
వాదము = సం. వాగ్వివాదము; తగవు
వాది = సం. వాదించువాఁడు
వాదు = త. కలహము; నింద
వాదోడు = ద్వ. మాటకు సహాయము
వాపి = సం. నడబావి; కోనేరు
వాపోవు = ద్వ. అఱచు; ఏడ్చు
వామ = సం. ఉత్తమస్త్రీ; సుందరమైన స్త్రీ
వామన = దే. లేఁతది
వామనము = సం. పొట్టిది
వామనుఁడు = సం. విష్ణువు; పొట్టివాఁడు
వామము= సం. సుందరము; హ్రస్వము
వామలూరువు = సం. పుట్ట
వామలోచన = సం. చక్కని కన్నులుగల స్త్రీ; ఆఁడుది
వాయసము = సం. కాకి; అగరుభ్రామ

వాయి = త. నోరు; ఖడ్గధార; ముఖము; వాయువు
వారి = సం. నీరు; కుండ
వారిజము = సం. పద్మము; శంఖము
వారిదము = సం. మేఘము
వారిధి = సం. సముద్రము
వారివాహము = సం. మబ్బు
వారుణి = సం. పడమటిదిక్కు; సారాయి
వారువము = దే. గుఱ్ఱము
వార్ధక్యము = సం. ముసలితనము
వాలకము = దే. మోసము; వేషము
వాలము = త. బెబ్బులి
వాలము = సం. తోఁక; కత్తి
వాలాయము = దే. నిరంతరము; అనివార్యము
వాలారు = ద్వ. వాఁడియైనది
వాలిక = దే. దీర్ఘము
వాలు = త. కత్తి; వాఁడిమి
వాలు = దే. అతిశయించు; దిగు
వాలు గంటి = దే. స్త్రీ
వాలుక = సం. ఇసుక
వాలుమెకము = సం. అడవిపంది
వాల్లభ్యము=సం. ఆధిపత్యము; దయ; ప్రీతి
వావి = దే. బంధుత్వము; బంధువరుస
వాసంతము=సం. కోయిల; ఒంటె
వాసి = దే. ప్రసిద్ధి; శ్రేయస్సు
వాస్తవము = సం. యథార్థము
వాస్తువు = సం. వాస్తుశాస్త్రము; ఇల్లు
వాహము=సం. గుఱ్ఱము; ఎద్దు; వాయువు; భుజము
వాహిని = సం. నది; సేన
వాహ్యాళి = సం. విహారము; స్వారి
వాళి = దే. వాడుక; పశువులు పోవు దారి

## వి

వింజేము = త. వింధ్యపర్వతము

విందు = దే. భోజనము; అతిథి; చుట్టము
వికచము = సం. వికసించినది; వెండ్రుకలు లేనిది
వికటించే=సం. గిట్టకపోవు; వంకరయగు
వికారము = సం. రోగము
వికావికలు = దే. చెల్లాచెదురు
వికృతము = సం. రోగముకలది
విక్రమించే = సం. శౌర్యము చూపు
విక్రముఁడు=సం. విష్ణువు; విక్రమార్కుఁడు
విక్రయము = సం. అమ్మకము
విక్రేత = సం. విక్రయించువాఁడు
విఖ్యాతము = సం. ప్రసిద్ధిచెందినది
విగ్రహము =సం. శరీరము; యుద్ధము; బొమ్మ
విఘాతము = సం. అడ్డంకి; పెద్దదెబ్బ
విగ్రహించే =సం. కలహించే; పోరు
విఘ్నము = సం. అంతరాయము
విచారము = సం. ఆలోచన; సంతాపము
విచ్చేలవిడి = దే. యథేచ్ఛము
విచ్ఛిత్తి = సం. ఎడఁబాటు; నాశము
విచ్ఛిన్నము = సం. ఎడబడినది; నఱక బడినది
విచ్ఛేదము = సం. ఎడఁబాటు
విజయము = సం. మిక్కిలి గెలుపు
విజయి = సం. జయించినవాఁడు
విజిగీష = సం. మిక్కిలి జయింపనిచ్ఛ
విజ్ఞుడు = సం. నేర్పరి
విటతటము = దే. తాఱుమాఱు
విటపము = సం. చిగురు; కొమ్మ
విటపి = సం. చెట్టు; మఱ్ఱిచెట్టు
విటి = సం. జారిణి; విటకత్తె
విటుఁడు = సం. జారుఁడు
విడంబించే=సం. అనుకరించు; మోసపుచ్చు
విడాకు = దే. భార్యాపరిత్యాగ పత్రిక
విడారకము = సం. పిల్లి
విడిది = దే. దిగుబస; విడియుట
విడిముడి = దే. ధనము; రొక్కము
విడెము = త. తాంబూలము
విత = త. వ్యర్థము
వితంతువు = సం. విధవ; ముండమోపి
విததము = సం. విస్తరించినది
వితతి = సం. సమూహము; విరవి
వితము = త. విధము
వితరణము = సం. ఈవి; దానము
వితర్ది = సం. అరుఁగు
వితానము =సం. సమూహము; మేలు కట్టు
విత్తము=సం. ధనము; ప్రసిద్ధినొందినది
విదారకము = సం. చీల్చునది; చెలమ
విదారణము = సం. చీల్చుట; యుద్ధము
విదుఁడు = సం. తెలిసినవాఁడు; పండితుఁడు
విదురుఁడు =సం. తెలిసినవాఁడు
విదుషి = సం. విద్వాంసురాలు
విదూషకుఁడు= సం. హాస్యగాఁడు
విద్యార్థి = సం. చేదువు కోరువాఁడు; చేదువు వాఁడు
విద్యుత్తు = సం. మెఱపు; సంధ్య
విధవ = సం. భర్తలేనిది
విధి =సం. బ్రహ్మ; పని; దురదృష్టము; భాగ్యము
విధువు = సం. విష్ణువు; చంద్రుఁడు; కర్పూరము
విధేయుఁడు= సం. వినయముకలవాఁడు
విధ్యుక్తము = సం. యథావిధియైనది
వినయశీలుఁడు = సం. విధేయుఁడు
వినిద్రాణము = సం. హెచ్చరికతోనున్నది
వినిమయము = సం. వస్తువులమార్పు
వినియోగము = సం. ఉపయోగము
వినీతుఁడు =సం. వర్తకుఁడు; వినయము గలవాఁడు
వినుచే = దే. వినిపించే; వినవచ్చు
వినుమ్రాను = దే. కల్పవృక్షము
వినోదము = సం. వేడుక; క్రీడ

విపణి=సం. అంగడి; అంగడివీధి; వర్తకుఁడు
విపత్తు = సం. ఆపద; ఇడుమ
విపన్నము = సం. పాము; విపత్తునొంది నది
విపర్యయము = సం. వ్యత్యాసము
విపినము=సం. అడవి; వనము; అరణ్యము
విపులము = సం. విరివియైనది
విప్రియము = సం. అసహ్యమైనది
విప్రుఁడు = సం. బ్రాహ్మణుఁడు
విఫలము=సం. నిష్ఫలము; ఫలములేనిది
విబుధుఁడు=సం. పండితుఁడు; వేలుపు
విభక్తము =సం. విభాగింపబడినది; వేఱు చేయబడినది
విభక్తి = సం. విభాగము; ప్రత్యయము
విభవము = సం. సంపద; గొప్పతనము
విభాకరుఁడు = సం. సూర్యుఁడు; అగ్ని
విభావరి = సం. రేయి; పసుపు; కుంటెన కత్తె
విభుఁడు = సం. ప్రభువు; భర్త
విభూతి = సం. ఒక భస్మము; ఐశ్వర్యము
విభ్రమము = స. భ్రాంతి; విలాసము
విభ్రాంతి = సం. ఆతురము; భ్రమము
విమలము = సం. నిర్మలమైనది; వెండి పూఁత
విముక్తి = సం. మోక్షము; విడుదల
వియత్తు = సం. ఆకాశము
వియోగము =సం. ఎడఁబాటు; విరహము
వియ్యము = దే. వైవాహిక సంబంధము; చుట్టఱికము
విరహము = సం. వియోగము; ఎడఁబాటు
విరళము = సం. ఎడమైనది; పెరుఁగు
విరామము = సం. విశ్రాంతి; ముగింపు
విరించి = సం. బ్రహ్మ; విష్ణువు; శివుఁడు
విరియు = దే. వికసించు; చెదరు; వ్యాపించు
విరుద్ధము = సం. వ్యతిరేకమైనది; పొసఁగనిది
విరోధము=సం. పగ; అడ్డంకి; ఎడఁబాటు
విలంబము = సం జాగు; వ్రేలుట
విలంభము =సం. త్యాగము; ఔదార్యము
విలక్షణము = సం. సుందరము; భేదము
విలపించు = సం. దుఃఖించు
విలయము=సం.ప్రళయము;ద్రవమగుట
విలసిల్లు = సం. ప్రకాశించు; ఒప్పు
విలాసము = సం. క్రీడ; సౌందర్యము
విలాసి =సం. మన్మథుఁడు; చంద్రుఁడు; విష్ణువు; అగ్ని
విలోకించు = సం. చూచు; ఆలోకించు
విల్లు = దే. ధనుస్సు
వివరము = త. వ్యాఖ్యానము
వివరము = సం. రంధ్రము; దూషణము
వివాదము = సం. తగవు; వాక్కలహము
వివాహము = సం. పెండ్లి; పరిణయము
వివేకము = సం. తెలివి; విభేదము
వివేకి = సం. వివేకము కలవాఁడు; జ్ఞాని
వివ్వచ్చుఁడు = త. అర్జునుఁడు
విశదము = సం. స్పష్టమైనది; తెల్లనిది
విశసనము = సం. చంపుట; వధ
విశారదుఁడు=సం. విద్వాంసుఁడు; నేర్పరి
విశిఖ = సం. రాజమార్గము; పాఱ
విశిఖము = సం. బాణము; శిఖలేనిది
విశిష్టము=సం. శ్రేష్ఠమైనది; కూడుకొన్నది
విశేష్యము = సం. నామవాచకము
విశ్రాంతి = సం. విరామము; ఊఱట
విశ్రుతి = సం. ప్రసిద్ధి; ప్రవాహము
విశ్లేషము=సం. ఎడఁబాటు; ఒడఁగూడమి
విశ్వంభర = సం. భూమి; ధరిత్రి; నేల
విశ్వంభరుడు = సం. విష్ణువు; ఇంద్రుఁడు
విశ్వము = సం. లోకము; సమస్తము
విశ్వరూపుఁడు = సం. విష్ణువు
విశ్వసించు = సం. నమ్ము
విశ్వామిత్రము=సం. కల్పితము; మోసము
విషధరము = సం. పాము; మబ్బు
విషపుచ్ఛము = సం. తేలు; తులువ
విషమశరుఁడు = సం. మన్మథుఁడు

విషము = సం. నీరు; గరళము
విషాణము = సం. కొమ్ము
విషాదము = సం. దుఃఖము; ఖేదము
విషువత్తు =సం. రేయి పగలు సమమైన కాలము
విషూచిక = సం. వమన విరేచన వ్యాధి
విష్టపము = సం. లోకము; భువనము
విష్ణుపదము =సం. ఆకాశము; పాల సముద్రము
విష్ణురథము = సం. గరుత్మంతుడు
విష్ణువు = సం. వెన్నుఁడు
విష్వక్సేనప్రియ = సం. లక్ష్మి
విష్వక్సేనుఁడు = సం. విష్ణువు; విష్ణు సేనాధిపతి
విసరము = సం. సమూహము; ప్రసరణము
విసుమానము=త. ఆశ్చర్యము; విస్మయము
విసువాసము=త. నమ్మకము; విశ్వాసము
విస్తరించే = సం. వ్యాపించే
విస్తారము = సం. విరివి; అనేకము
విస్ఫులింగము = సం. అగ్నికణము
విస్మయము = సం. ఆశ్చర్యము
విహంగము = సం. పక్షి; బాణము
విహారము = సం. వేడుకగా దిరుగుట; తోఁట; బౌద్ధాలయము
విహితుఁడు = సం. స్నేహితుఁడు
విహ్వలుఁడు=సం. భయాదులచే స్మృతి తప్పినవాఁడు

## వీ

వీఁక=దే. గర్వము; విధము; ఉత్సాహము
వీక్షణము=సం. చూపు; చూచేట; దృష్టి
వీక్షించు = సం. చూచే
వీచి = సం. అల; సుఖము
వీటి =సం. తాంబూలము; ముడి; రవిక ముడి
వీటిఁబోవు = దే. వ్యర్థమగు
వీడు = దే. వదలు; పట్టణము
వీడుకోలు = దే. పోవననుజ్ఞ; విడుపు; మరణము
వీడుపడు = దే. మాఱుపడు
వీడెము = త. తాంబూలము
వీతిహోత్రుఁడు=సం. అగ్ని; సూర్యుఁడు
వీను = దే. చెవి; ప్రసిద్ధి
వీనుమిగులు = దే. ప్రసిద్ధికెక్కు

## వృ

వృకము = సం. తోఁడేలు
వృకోదరుఁడు = సం. భీముఁడు
వృతము = సం. ఆవరింపబడినది
వృత్తము = సం. నడత; తాఁబేలు; గుండ్రని
వృత్తాంతము= సం. సమాచారము; కథ
వృత్తి = సం. జీవనోపాయము; నడవడిక
వృథా = సం. వ్యర్థముగా
వృద్ధుడు = సం. ముసలివాఁడు; తెలిసిన వాఁడు
వృశ్చికము = సం. తేలు; కందురీఁగ; గొంగళి పురుగు
వృషణము = సం. ముష్కము
వృషభము = సం. ఎద్దు
వృష్టి = సం. వర్షము; వాన
వృష్ణి = సం. పొట్టేలు; అగ్ని

## వె

వెంగలి = త. అవివేకి; వెఱ్ఱివాఁడు
వెండి = దే. రజతము; మఱి; పిమ్మట
వెంపరలాడు = దే. పీడించే; హింసించే
వెకలి = త. మూఢుఁడు; వెఱ్ఱిది
వెక్కసము = దే. అసహ్యము; అధికము
వెక్కిరించే = త. అపహాస్యముచేయు
వెగటు = త. అసహ్యము; విరసము
వెచ్చన = దే. వేఁడిమి; వేఁడి
వెచ్చము = త. వ్యయము

వెజ్జే = త. వైద్యుఁడు
వెడద = దే. విశాలము
వెత = త. దుఃఖము
వెదచేల్లు = దే. వ్యాపింపజేయు
వెనుదీయు = దే. వెనుకకు మరలు
వెన్ను = దే. వీఁపు; ఇంటినడికొప్పు
వెన్నుఁడు = త. విష్ణువు
వెరఁగు = దే. ఆశ్చర్యము; నిశ్చేష్టత
వెరవు = దే. ఉపాయము; విధము
వెఱ = దే. భయము; ఆశ్చర్యము
వెఱఁగు = దే. ఆశ్చర్యము; నిశ్చేష్టత
వెఱవు = దే. భయము
వెల = దే. విలువ; మూల్యము
వెలఁది = దే. ఆఁడుది; నిర్మలము
వెలయాలు = దే. వేశ్య
వెలయు = త. ప్రకాశించు; ప్రసిద్ధికెక్కు
వెలి = దే. బహిష్కారము; బాహ్యము
వెలితి = దే. తక్కువ; తక్కువైనది
వెలుఁగు = దే. ప్రకాశించే; కిరణము
వెల్లాటకత్తె = ద్వ. జారిణి
వెల్లి = దే. ప్రవాహము; పరంపర
వెల్లి = త. తెలుపు
వెల్లిగొను = దే. ప్రవహించు

## వే

వే = దే. అనేకము; వేయి
వే. = త. వేగముగ
వేంకటాచలము = సం. తిరుపతికొండ
వేంచేపు = దే. ఆగమనము; గమనము
వేఁకి = దే. జ్వరము
వేఁగి = త. పులి; వ్యాఘ్రము
వేఁటరి = దే. వేఁటకాఁడు
వేఁడివేలుపు = దే. సూర్యుఁడు; అగ్ని
వేఁడుకొను = దే. ప్రార్థించు
వేఁపి = దే. కుక్క; శునకము; సారమేయము
వేకువ = దే. ప్రభాతము; వేగుజాము
వేగము = సం. ప్రవాహము; త్వరితము; జవము
వేగి = సం. గుఱ్ఱము; వడిగలది
వేగు = దే. ఉదయమగు; రాజ్య సమాచారము
వేగుఁజుక్క = ద్వ. శుక్రుఁడు
వేచు = దే. ఎదురుచూచు; ప్రతీక్షించు
వేడబము = త. మాయ; వేషము; వంచన
వేణి = సం. జడ; ప్రవాహము; కాలువ
వేణువు = సం. పిల్లంగ్రోవి; వెదురు
వేతనము = సం. జీతము; జీవనాధారము; కూలి
వేత్త = సం. తెలిసినవాఁడు
వేత్రము = సం. బెత్తము; పేముచెట్టు
వేత్రి = సం. ద్వారపాలకుఁడు; దండధరుఁడు
వేదండము = సం. ఏనుఁగు
వేదన = సం. నొప్పి; తెలివి
వేదాంతము = సం. బ్రహ్మవిచారము; ఉపనిషత్తు
వేదిక = సం. తిన్నె; పీఠము
వేధ = సం. విష్ణువు; బ్రహ్మ; విద్వాంసుఁడు
వేమాఱు = దే. అనేకసారులు; మాటి మాటికి
వేరు = దే. చెట్టుయొక్క మూలము; అన్యము
వేఱు = దే. భేదము; అన్యము
వేల = సం. ఉప్పెన; చెలియలికట్ట; పొలిమేర; వ్యాధి
వేలుపు = దే. దేవత; జోస్యము
వేలుపుగిడ్డి = ద్వ. కామధేనువు
వేలుపుమానికము = ద్వ. చింతామణి
వేవురు = దే. వేయిమంది
వేవెలుఁగు = దే. సూర్యుఁడు; సహస్రాంశువు
వేశ్మము = సం. ఇల్లు; గృహము
వేసఁగి = త. ఎండాకాలము
వేసట = దే. అలసట; అలపు; శ్రమము

వేళము = త. త్వరితముగ

## వై

వైకుంఠము = సం. విష్ణువుండెడుస్థానము
వైకుంఠుఁడు = సం. విష్ణువు
వైతరణి=సం. నరకమునందుండెడి ఏఱు
వైతాళికుఁడు = సం. మేలుకొలుపువాఁడు
వైదుష్యము=సం. పాండిత్యము; తెలివి
వైదేహి = సం. సీతాదేవి; గోరోజనము
వైధవ్యము = సం. ముండమోపితనము
వైనతేయుఁడు = సం. గరుత్మంతుఁడు; అనూరుఁడు
వైపరీత్యము = సం. విపరీతస్థితి; తడఁబాటు; విపర్యయము
వైభవము=సం. ఐశ్వర్యము; గొప్పతనము
వైరము=సం. విరోధము; విద్వేషము; పగ
వైవస్వతుడు=సం. శని; యముఁడు; ఒక మనువు
వైవాహికము=సం. వివాహసంబంధమైనది
వైశిష్యము = సం. కపటము; దూష్యము
వైశిష్ట్యము = సం. విశేషగుణము; భేదము
వైశ్వానరుఁడు=సం. అగ్ని; వేఁడివేలుపు
వైష్ణవము = సం. విష్ణు సంబంధమైనది; ఒక మతము
వైష్ణవుఁడు = సం. విష్ణుభక్తుఁడు
వైళము = దే. శీఘ్రము; వేగము

## వో

వోఢ = సం. మోపరి; కూలివాఁడు

## వ్యం

వ్యంజనము = సం. కూర; గుఱుతు; ఆలు మగలగుఱి
వ్యక్తుఁడు = సం. తెలివిగలవాఁడు; విష్ణువు
వ్యగ్రత = సం. తొట్రుపాటు
వ్యజనము = సం. విసనకఱ్ఱ
వ్యథ = సం. బాధ
వ్యభిచారము=సం. తప్పిచరించుట; అంకు
వ్యభిచారిణి = సం. అంకుటాలు
వ్యయము = సం. క్షయము; వెచ్చము
వ్యవధానము = సం. అవకాశము; మఱుఁగు; కప్పు
వ్యవస్థ = సం. కట్టుఁబాటు; క్రమము
వ్యవహారము = సం. తగవు; న్యాయము; వాడుక; జూదము
వ్యసనము = సం. ఆపద; ఆసక్తి; పాపము; అపాయము

## వ్యా

వ్యాకులత = సం. చింత; దుఃఖము
వ్యాకృతి = సం. వ్యాకరణము; విశదపఱచుట
వ్యాఘ్రము = సం. పులి
వ్యాఘ్రి = సం. ఆఁడుపులి
వ్యాజస్తుతి = సం. కపటస్తుతి
వ్యాజోక్తి = సం. ఛలోక్తి; సూచన
వ్యాజ్యము = సం. దే. తగవు; వివాదము
వ్యాధుఁడు=సం. బోయవాఁడు; దుష్టుఁడు
వ్యాప్తి = సం. వ్యాపించుట; పొందుట; ప్రసిద్ధికెక్కుట
వ్యామోహము = సం. అత్యంతమోహము
వ్యాలోలము = సం. మిక్కిలి కదలునది
వ్యావహారికము=సం. వాడుక; ఉపయోగము
వ్యాళము = సం. పాము; పులి; తులువ ఏనుఁగు

## వ్యు

వ్యుత్పత్తి = సం. పాండిత్యము; పుట్టుక
వ్యుత్పన్నుఁడు =సం. జ్ఞానముకలవాఁడు

## వ్యూ

వ్యూఢము=సం. దట్టమైనది; విశాలమైనది

వ్యో

వ్యోమము = సం. ఆకాశము; జలము

వ్ర

వ్రక్కలించు = త. ఛేదించే
వ్రచ్చు=త. చీల్చు; ఛేదించు
వ్రజము = సం. సమూహము; త్రోవ
వ్రణము = సం. కుఱుపు; గాయము; కిణము
వ్రయ్యు = త. చీలు; బ్రద్దలగు

వ్రా

వ్రాతము = సం. సమూహము; గుమి
వ్రాయి = దే. అక్షరము; రేఖ
వ్రాలు = దే. ఒఱగు; సంతకము

వ్రీ

వ్రీడ = సం. సిగ్గు; లజ్జ; వినయము
వ్రీలు = దే. చీలు
వ్రీహి = సం. వడ్లు; ఎఱ్ఱవడ్లు

వ్రే

వ్రే=దే. గొల్లకులము
వ్రేఁగు = దే. తపించు; భారము
వ్రేఁత = దే. దెబ్బ; వ్రేయుట
వ్రేటు = దే. దెబ్బ; వ్రేయుట
వ్రేత = దే. గొల్లది; గోపిక
వ్రేలు = దే. వ్రేలాడు; వేలు; మునుఁగు
వ్రేల్మి = దే. హోమము

శ

శంక = సం. సందేహము; భయము; విచారము
శంకరుఁడు =సం. శివుఁడు; సుఖమును కలుగజేయువాఁడు
శంకువు = సం. మేకు; బల్లెము; మోడు
శంఖము = సం. సంకు; నిధి విశేషము
శంఖపాణి = సం. విష్ణువు
శంఠుఁడు = సం. నపుంసకుఁడు
శంప = సం. మెఱపు; శంఖధ్వని
శంబరారి =సం. మన్మథుఁడు; మారుఁడు
శంబరి = సం. మాయ; గారడీ
శకటము = సం. బండి
శకము = సం. ఒకని పరిపాలనలో చేరిన కాలము
శకలము = సం. నార; ఖండము
శకుంతము = సం. పక్షి
శక్తి = సం. బలిమి; పార్వతి
శక్తుఁడు = సం. శక్తిగలవాఁడు
శక్రుఁడు = సం. ఇంద్రుఁడు
శఠము = సం. మూర్ఖము; మోసము
శఠుఁడు = సం. మోసగాఁడు; మధ్యస్థ పురుషుఁడు
శతకము = సం. నూఱు పద్యములుకల గ్రంథము
శతకోటి =సం. నూఱుకోట్లు; వజ్రాయుధము
శతమానము=సం. తాలిబొట్టు; మంగళ సూత్రము
శతము = సం. నూఱు; వంద
శతానందము = సం. విష్ణురథము
శతానందుఁడు = సం. విష్ణువు; బ్రహ్మ
శతాబ్దము=సం. నూఱు సంవత్సరముల కాలము
శతారము=సం. వజ్రాయుధము
శత్రువు = సం. పగవాఁడు
శని=సం. శనైశ్చరుఁడు
శనైశ్చరుఁడు = సం. ఒక గ్రహము; శని
శపథము = సం. ప్రతిజ్ఞ; ఒట్టు
శబరి = సం. శబర స్త్రీ
శబరుఁడు =సం. శివుఁడు
శబ్దము = సం. ధ్వని; మాట
శబ్దశాస్త్రము = సం. వ్యాకరణము

శమము = సం. శాంతి; కామక్రోధాదులు లేక అడఁగియుండుట
శమి = సం. జమ్మిచెట్టు; శమము కలవాఁడు
శమించే = సం. శాంతించే; తగ్గు; అడఁగు
శయ్య=సం. పడక; విధము; పదగుంఫనము
శరణము = సం. రక్షణము; గృహము; వధము; రక్షకము
శరణు = సం. శరణాగతి; నమస్కారము; రక్షకము
శరము = సం. బాణము; నీరు; జెల్లు; మీఁది పెరుఁగు
శర్వరి = సం. రాత్రి; ఆఁడుది; పసుపు
శరధి = సం. అమ్ములపొది; సముద్రము
శలభము = సం. మిడుత
శలాక = సం. బాణము; ఎముక; గొడుగులోనగు వాని కమ్మి
శల్యము = సం. బాణము; ఎముక; విషము; మేకు
శశాంకుఁడు = సం. చంద్రుఁడు
శస్త్రము = సం. ఆయుధము; వ్రణము లోనగువానిని కోయుట

శా

శాంకరుఁడు = సం. వినాయకుఁడు; కుమారస్వామి
శాంతము = సం. ఓర్పు; ఒకరసము
శాంబరి = సం. మాయ; గారడీ; రతీదేవి
శాంభవి = సం. పార్వతి; నల్లగఱిక
శాకము = సం. కూర; శక్తి
శాఖ = సం. చెట్టుకొమ్మ; తెగ; చేయి; వేదభాగము
శాఖి = సం. చెట్టు; వేదము
శాతకుంభము = సం. బంగారము; ఉమ్మెత్త చెట్టు
శాత్రవము = సం. శత్రుత్వము; శత్రు సమూహము
శాత్రవుఁడు = సం. శత్రువు; పగవాఁడు
శాపము = సం. తిట్టు; ఒట్టు
శారద = సం. సరస్వతి; పార్వతి
శారిక = సం. గోరువంక; నక్షత్రము
శార్ఙ్గము = సం. విష్ణువుయొక్క విల్లు; విల్లు
శార్ఙ్గి = సం. విష్ణువు
శార్దూలము = సం. పులి; ఏఁటింత
శార్వరి = సం. రాత్రి; ఒక సంవత్సరము
శాల్మలి = సం. బూరుగుచెట్టు
శాసించే=సం. ఆజ్ఞాపించే; శిక్షించే
శాస్తి = సం. శిక్ష; శాసనము

శి

శింజిని = సం. వింటనారి; కాలిఅందె
శింశుమారము = సం. మొసలి
శిక్ష = సం. శిక్షించుట; విద్యాభ్యాసము
శిరసావహించే = సం. ఆమోదించే
శిరస్త్రాణము = సం. బొమిడికము
శిరోజము = సం. తలవెండ్రుక
శిల్పము = సం. నేర్పు; పని; సృష్టి
శిల్పి = సం. శిల్పకారుఁడు
శివము = సం. శుభము; మోక్షము
శివుఁడు = సం. ఈశ్వరుఁడు
శిశిరము = సం. చల్లనిది; ఒక ఋతువు

శీ

శీకరము = సం. తుంపర; నీటిబిందువు
శీతకరుఁడు = సం. చంద్రుఁడు
శీతలము = సం. చందనము; చల్లనిది
శీధువు = సం. పుష్పరసము
శీర్షము = సం. తల; శిరము
శీలము = సం. మంచినడత; స్వభావము

శు

శుంఠ = సం. మూఢుఁడు; శుంఠుఁడు
శుండ = సం. తొండము; కల్లు; వేశ్య

శుండాలము = సం. ఏనుఁగు
శుకము = సం. చిలుక
శుక్తి = సం. ముత్తెపుచిప్ప; నేత్రరోగము
శుక్రము = సం. రేతస్సు; కంటిపువ్వు
శుక్లము = సం. తెలుపు; వెండి; వీర్యము
శుచి = సం. అగ్ని; తెలుపు
శుద్ధము = సం. తెల్లనిది; దోషములులేనిది
శుద్ధి=సం. చక్కజేయుట; మార్జనము
శుల్కము = సం. సుంకము; లాభము; కన్యాశుల్కము
శుశ్రూష = సం. సేవ; వినుటకు కోరిక
శుష్కము = సం. ఎండినది; వట్టి

శూ

శూకము=సం. తేలుకొండి; దయ; పరిముల్లు
శూన్యము=సం. సున్న; వట్టిది; పాడు
శూరుఁడు = సం. సూర్యుఁడు; వీరుఁడు

శృ

శృంఖల =సం. సంకెల; మగవాని మొల త్రాడు
శృంగము = సం. కొమ్ము; ప్రాధాన్యము
శృంగారము=సం. అలంకారము; సౌంద ర్యము; సురతము
శృంగరయోని = సం. మన్మథుఁడు

శే

శేఫము = సం. మగగుఱి
శేముషి = సం. బుద్ధి
శేషశయనుఁడు = సం. విష్ణువు

శై

శైలము = సం. పర్వతము
శైవలము = సం. నాఁచు; నీటిపాఁచి
శైవలిని = సం. నది
శైశవము = సం. బాల్యము; శిశుత్వము

శో

శోణితము = సం. రక్తము
శోణిమ = సం. ఎఱుపు
శోధని = సం. చీఁపురుకట్ట
శోభ = సం. కాంతి; ఇచ్ఛ
శోషించు = సం. ఇంకు; ఎండు; మూర్ఛపొందు
శోషితము = సం. ఎండినది; చిక్కినది; వాడినది

శౌ

శౌచము = సం. శుచిత్వము; నైర్మల్యము
శౌరి = సం. విష్ణువు

శ్మ

శ్మశ్రువు = సం. గడ్డమును మీసమును

శ్యా

శ్యామల = సం. పార్వతి
శ్యామలము = సం. వల్లనిది; నలుపు
శ్యాలకి = సం. తోడఁబుట్టినది

శ్యే

శ్యేనము = సం. డేగ; తెలుపు

శ్ర

శ్రవణుఁడు = సం. సన్న్యాసి; యతి
శ్రవణము = సం. వినికిడి; చెవి
శ్రవము = సం. చెవి

## శ్రా

శ్రాంతము = సం. అలసటపొందినది
శ్రాంతుఁడు = సం. యతి; శాంతిపొందిన వాఁడు
శ్రాద్ధము = సం. పితృకర్మ
శ్రావ్యము = సం. వినఁదగినది

## శ్రీ

శ్రీ = సం. లక్ష్మి; సంపద; శోభ; విషము
శ్రీకంఠుఁడు = సం. శివుఁడు
శ్రీకాంతుఁడు = సం. విష్ణువు
శ్రీఖండము = సం. చందనము
శ్రీచూర్ణము = సం. తిరుచూర్ణము
శ్రీధరుఁడు = సం. విష్ణువు
శ్రీనివాసుఁడు = సం. విష్ణువు
శ్రీపతి = సం. విష్ణువు
శ్రీమంతుఁడు = సం. విష్ణువు
శ్రీరంగము = సం. ఒక దివ్య క్షేత్రము
శ్రీవత్సలాంఛనుఁడు = సం. విష్ణువు

## శ్రు

శ్రుతము = సం. వినఁబడినది
శ్రుతి = సం. వేదము; చెవి

## శ్రే

శ్రేణి = సం. వరుస; గుంపు
శ్రేయము = సం. శుభము; శ్రేష్ఠమైనది
శ్రేష్ఠుఁడు = సం. గొప్పవాఁడు

## శ్రో

శ్రోణి = సం. పిఱుఁదు; మొల; మార్గము
శ్రోత = సం. వినువాడు
శ్రోత్రము = సం. చెవి

## శ్లా

శ్లాఘ = సం. పరిచర్య; ప్రశంస; స్తోత్రము

## శ్లే

శ్లేష=సం. కలయిక; ఒక అర్థాలం కారము
శ్లేషము = సం. కౌఁగిలి; చేరిక
శ్లేష్మము = సం. కఫము; తెమడ

## శ్లో

శ్లోకము = సం. సంస్కృతపద్యము

## శ్వ

శ్వపచుఁడు = పరి. చండాలుఁడు
శ్వవృత్తి = సం. సేవ; కొలువు
శ్వశురుఁడు = సం. మామ
శ్వశురులు = సం. అత్తమామలు
శ్వశ్రువు = సం. అత్త
శ్వశ్రేయసము=సం. మోక్షము; శుభము; సుఖము

## శ్వా

శ్వానము = సం. కుక్క
శ్వాసము = సం. ఊపిరి; వాయువు

## శ్వే

శ్వేతము = సం. వెండి; కైలాసపర్వతము; తెలుపు

## ష

షండము = సం. సమూహము; ఆఁబోతు; పేడి

షండుఁడు = సం. నపుంసకుఁడు
షట్పదము = సం. తుమ్మెద
షడ్డకుఁడు = సం. తోడిఅల్లుఁడు
షష్టి = సం. అఱువది
షష్టిపూర్తి = సం. అఱువది సంవత్సరములు నిండుట
షష్ఠము = సం. ఆఱవది
షష్ఠాష్టకము = సం. విరోధము
షష్ఠి = సం. ఆఱవతిథి

## షా

షాడబము = సం. రుచి; మధురాది రసము

## షో

షోడశము = సం. పదునాఱవది

## ష్ఠీ

ష్ఠీవనము = సం. ఉమియుట; ఉమ్మి

## స

సంకటము = సం. ఇఱుకు; రోగము; బాధ
సంకరము = సం. కలగలపు
సంకల్పము = సం. మనోనిశ్చయము
సంకాశము = సం. సమానమైనది
సంకీర్తనము = సం. స్తోత్రము
సంకు = సం. శంఖము
సంకులము = సం. వ్యాకులము
సంకేతము = సం. సంజ్ఞ; ఏర్పాటు
సంకోచము = సం. సంశయము; బిడియము
సంక్షోభము = సం. కలఁత; దుఃఖము
సంగడికాఁడు = ద. స్నేహితుఁడు
సంగమము = సం. చేరిక; పోట్లాట; సంభోగము
సంగరము = సం. యుద్ధము; ప్రతిజ్ఞ
సంగాతము = సం. స్నేహము; చెలిమి
సంగ్రహణము = సం. పట్టుకొనుట
సంగ్రామము = సం. యుద్ధము
సంఘటనము = సం. ఘటన; కూడుట
సంఘట్టనము = సం. ఒరసికొనుట
సంచితము = సం. కూడబెట్టబడినది
సంచేకరువు = త. క్రయవిక్రయములు మొదలైన వానిగట్టికైముందిచ్చెడి ధనము; బయానా
సంజనితము = సం. పుట్టినది
సంజీవనము = సం. మరలబ్రతుకుట
సంజ్ఞ = సం. సంకేతము; గుఱుతు
సంజె = త. సంధ్య
సంతతము = సం. ఎల్లప్పుడు
సంతరించే = దే. సేకరించే
సంతాపము = సం. వేడిమి; విచారము
సంతుష్టి = సం. సంతోషము
సంత్రాసము = సం. భయము
సంద్రాతము = సం. కట్టబడినది; కూర్పబడినది
సందిగ్ధము = సం. సందేహామైనది
సందోహము = సం. సమూహము
సంద్రము = సం. సముద్రము
సంధానము = సం. కూర్చుట; సంఘటనము
సంధి = సం. కూడిక; సందు; ఆండుగుతి
సంపన్నము = సం. సంపదతోకూడినది
సంపర్కము = సం. కలయిక; చేరిక
సంపాదనము = సం. గడించేట
సంప్రతించే = సం. సరిచూచే
సంప్రదాయము = సం. వంశపుతీరు
సంభవము = సం. పుట్టుక; హేతువు
సంభావ్యము = సం. సమ్మానింపదగినది
సంభ్రమము = సం. ఉత్సాహము
సంస్కృతము = సం. ఒకభాష

సంహతి = సం. చేరిక; దట్టము; సమూహము
సకలము = సం. సర్వము
సకియ = త. ఆఁడుది; చెలికత్తె
సఖ్యము = సం. స్నేహము; చెలిమి
సచివుఁడు = సం. మంత్రి; స్నేహితుఁడు; సహాయుఁడు
సడి = దే. ధ్వని; నింద; జాడ
సతతము = సం. ఎల్లప్పుడు
సతి = సం. పతివ్రత; మంచిభార్య
సత్పథము = సం. మంచిత్రోవ
సత్త్వము = సం. ఒకగుణము; దేహబలము
సదనము = సం. గృహము; బలము
సదస్సు = సం. సభ; రాజసభ
సదాగతి = సం. మోక్షము
సనాతనుండు = సం. శాశ్వతుఁడు; విష్ణువు; బ్రహ్మ; శివుఁడు
సన్న = త. సంజ్ఞ
సన్నాహము = సం. ప్రయత్నము; కవచము
సన్నిధానము = సం. సమీపము; ఆశ్రయము
సన్నిహితుఁడు = సం. సమీపబంధువు
సన్మానము = సం. గౌరవము
సపత్ని = సం. సవతి
సప్తజిహ్వుడు = సం. అగ్ని
సప్తతంతువు = సం. యజ్ఞము
సప్తతి = సం. డెబ్బది
సప్తమి = సం. ఏడవది
సఫలము = సం. సార్థకము; ఫలముతో గూడినది
సభ్యత = సం. మంచినడవడి
సభ్యుఁడు = సం. సభయందుండువాఁడు; మంచివాఁడు
సమంజసము = సం. న్యాయము; తగినది
సమకట్టు = ద్వ. యత్నించే; సేకరించే
సమకూరు = ద్వ. లభించే

సమక్షము = సం. ఎదుట
సమధిగమము = సం. పొందుట
సమయు = త. నశించు; చచ్చు
సమరము = సం. యుద్ధము
సమాజ్ఞ = సం. కీర్తి
సమావేశము = సం. కలయిక; ప్రవేశము
సమాహ్వాయము = సం. నామధేయము; యుద్ధము
సమీరము = సం. వాయువు
సమ్మానము = సం. గౌరవము
సమ్మార్జనము = సం. శుద్ధిచేయుట; విగ్రహములనుకడుగుట
సమ్మేళనము = సం. కలుపుట; కలియుట
సరసము = సం. మనోహరము
సరసి = సం. సరస్సు; కొలను
సరసిజనాభుఁడు = సం. విష్ణువు
సరసిజము = సం. కమలము
సరళము = సం. వంకరకానిది
సరిగ = సం. జేలతారు
సరీసృపము = సం. పాము; ప్రాఁకెడిజంతువు
సరోజము = సం. పద్మము
సరోజిని = సం. తామరకొలను; తామర
సర్గము = సం. అధ్యాయము
సర్వంసహ = సం. భూమి
సలిలము = సం. నీరు; ఉదకము
సవిత = సం. తండ్రి; సూర్యుఁడు
సవ్యము = సం. అనుకూలము
సవ్యసాచి = సం. అర్జునుఁడు
సవ్వడి = దే. జాడ
సహకారము = సం. సహాయము; తియ్యమామిడిచెట్టు
సహస్రాక్షుఁడు = సం. ఇంద్రుఁడు
సహృదయుఁడు = సం. మంచిమనస్సు కలవాఁడు

సహోదరుఁడు = సం. తోడఁబుట్టినవాఁడు
సహ్యము = సం. సహింపదగినది

## సా

సాంకర్యము = సం. కలసినది
సాంగత్యము = సం. చేరిక; స్నేహము
సాంగము = సం. పూర్ణము
సాంత్వనము = సం. ఓదార్చుట
సాంద్రము = సం. దట్టమైనది
సాఁకు = దే. కాపాడు; పెంచు
సాకు = దే. వ్యాజము; మిష
సాగరము = సముద్రము
సాజము = త. సహజము
సాతు = త. బాటసారులగుంపు
సాత్వికుఁడు = సం. తిన్ననివాఁడు
సాదము = దే. అన్నము
సాదరము = సం. సన్మానము
సాదృశ్యము = సం. పోలిక; సామ్యము; దృష్టాంతము
సాధువు = సం. మంచివాఁడు; బైరాగి
సాధ్వి = సం. పతివ్రత
సామజము = సం. ఏనుఁగు
సామము = సం. ఒక ఉపాయము; మంచిమాట; ఒక వేదము
సామెత = త. లోకోక్తి
సామ్యము = త. పోలిక
సాయకము = సం. బాణము; కత్తి
సారంగము = సం. లేడి; ఏనుఁగు; తుమ్మెద
సారమేయము = సం. కుక్క
సార్థవాహుఁడు = సం. వర్తకుఁడు
సార్వభౌముఁడు = సం. చక్రవర్తి
సాలగ్రామము = సం. విష్ణుమూర్తి చిహ్నితశిల
సావధానము = సం. శ్రద్ధ

## సి

సింగఁడు = త. నృసింహుఁడు
సింగము = త. సింహము
సింధురము = సం. ఏనుఁగు
సింధువు = సం. ఏనుఁగు; సముద్రము
సింహావలోకనము = సం. తిరిగిచూచుట
సికత = సం. ఇసుకనేల; ఒకవ్యాధి
సిక్తము = సం. తడిసినది; తడుపఁ బడినది
సిగ్గఱు = దే. సిగ్గుచెడు
సిడిముడి = దే. కోపము
సితాభము = సం. కర్పూరము
సిద్ధి = సం. వాంఛితప్రాప్తి; పూర్తి
సినీవాలి = సం. పార్వతి
సిరంగము = త. శ్రీరంగము
సిరి = త. లక్ష్మి; సంపద; శోభ
సిరిగంధము = త. శ్రీచందనము

## సీ

సీతు = త. చేలి; చేలికాలము
సీమ = సం. ఎల్ల; గుఱుతు; ఒడ్డు
సీమ = దే. రాజ్యము; ప్రదేశము
సీమంతము = సం. గర్భిణీస్త్రీలకు చేయు శుభకార్యము; పాపట
సీమంతిని = సం. ఆఁడుది
సీరము = సం. నాఁగలి
సీవని = సం. సూది

## సు

సుంకము = త. అమ్మకపు పన్ను; శుల్కము
సుకరము = సం. సులభము
సుకృతము = సం. పుణ్యము; శుభము
సుడియు = దే. చుట్టుకొను
సుడివాలు = దృ. విష్ణుచక్రము

సుత = సం. మొదలుకొని
సుదర్శనము = సం. విష్ణుచక్రము
సుధ = సం. పాలు; అమృతము
సువర్ణుఁడు = సం. గరుత్మంతుఁడు
సువర్వుఁడు = సం. దేవత; వేలుపు
సుప్తి = సం. నిద్ర; తిమ్మిరి
సుభాషితము = సం. మంచివాక్కు
సుభిక్షము = సం. కఱవులులేనిది; మంచికాలము
సుమంగలి = సం. ముత్తైదువ
సుమము = సం. పూవు
సురతము = సం. స్త్రీ పురుషులకలయిక
సురభి = సం. ఆవు; కామధేనువు
సురలు = సం. దేవతలు; వేలుపులు
సువర్ణము = సం. బంగారము; ధనము
సువారము = త. వంట
సువాసిని = సం. ముత్తైదువ; పేరంటాలు
సుషుప్తి = సం. మంచినిద్ర

## సూ

సూకరము = సం. పంది
సూక్తి = సం. చక్కఁగజెప్పబడినమాట
సూచిక = సం. తెలియజేయునది
సూడిద = దే. కానుక; వింతవస్తువు
సూతిక = సం. బాలెంతరాలు
సూతుఁడు = సం. రథమునడుపువాఁడు
సూత్రధారుఁడు = సం. నడపించువాఁడు
సూనృతము = సం. శుభము; సత్యము
సూపము = సం. వండినపప్పు

## సృ

సృగాలము = సం. నక్క
సృజించే = సం. సృష్టించు

## సె

సెజ్జ = త. శయ్య
సెబ్బరి = దే. చెడుగు
సెమ్మె = త. దీపస్తంభము

## సే

సేకము = సం. చేల్లుట; తడుపుట
సేద్యము = త. కృషి; వైరుపెట్టుట
సేమంతిక = సం. చేమంతి

## సై

సైంధవము = సం. గుఱ్ఱము
సైఁచు = సం. ఓర్చు; రుచించు
సైకతము = సం. ఇసుకనేల; ఇసుకదిబ్బ
సైరణ = త. సహనము

## సొ

సొగసు = త. అందము

## సో

సోఁకు = దే. తగులు; రాక్షసుఁడు
సోన = సం. దే. అల్పవర్షము; వర్షము
సోపానము = సం. మెట్టు
సోయగము = దే. అందము

## సౌ

సౌకర్యము = సం. నేర్పు; వీలు; అనాయాసము
సౌగంధికము = సం. చెంగలువ; గంధకము
సౌజన్యము = సం. మంచితనము
సౌదామిని = సం. మెఱుపు
సౌప్తికము = సం. నిద్రించునపుడు చంపుట
సౌభాగ్యవతి = సం. ముత్తైదువ; మంచిస్త్రీ

సౌభ్రాత్రము = సం. మంచిసోదర భావము
సౌరభము = సం. ఎద్దు; పరిమళము
సౌశీల్యము = సం. మంచినడత
సౌహార్ధము = సం. స్నేహము; సుహృద్భావము

**స్క**

స్కంధము = సం. ప్రకరణము; చెట్టు బోదె
స్కంధావారము = సం. దండువిడిసినచోటు; దండు

**స్ఖ**

స్ఖలనము = సం. జారుపాటు

**స్త**

స్తంభము = సం. కంబము; ఆధారము
స్తనము = సం. కుచము; చేన్న
స్తన్యము = సం. చేనుబాలు
స్తవము = సం. స్తోత్రము; పొగడ్త

**స్తో**

స్తోత్రము = సం. స్తుతి; పొగడ్త
స్తోమము = సం. సమూహము; స్తోత్రము; యజ్ఞము

**స్థ**

స్థపతి = సం. శిల్పి; శ్రేష్ఠుడు

**స్థా**

స్థాణువు = సం. మ్రోడు; స్థిరమైనది; మేకు
స్థానాపతి = సం. మధ్యవర్తి
స్థాలి = సం. వంటకుండ; చిన్నచెంబు
స్థావరము = సం. కదలనిది; కొండ

**స్థి**

స్థితి = సం. ఉనికి; ఆస్తి; అర్హత
స్థిర = సం. భూమి

**స్థే**

స్థేమము = సం. శరీరబలము

**స్థై**

స్థైర్యము = సం. స్థిరత్వము

**స్న**

స్నవనము = సం. స్నానము; నీరుచిలుకరించుట; మునుక

**స్నా**

స్నాతుఁడు = సం. స్నానము చేసినవాఁడు
స్నాయువు = సం. సన్ననరము

**స్ని**

స్నిగ్ధము = సం. నునుపుగలది; స్నేహము గలది
స్నిగ్ధుఁడు = సం. స్నేహితుఁడు

**స్ప**

స్పర్థ = సం. పోటీ; పోలిక
స్పర్శనము = సం. తాఁకుట; ఈవి; వాయువు
స్పర్శవేధి = సం. పరుసవేది
స్పష్టము = సం. వెల్లడియైనది

**స్పృ**

స్పృశించు = సం. తాకు
స్పృహ = సం. కోరిక; ఇచ్ఛ

## స్ఫ

స్ఫట = సం. పాముపడగ
స్ఫటి = సం. పాము
స్ఫటికము = సం. ఒకజాతి తెల్లనిఱాయి

## స్ఫు

స్ఫుటము = సం. స్పష్టమైనది; వికసించినది
స్ఫురణము = సం. తోఁచుట; అదరుట
స్ఫులింగము = సం. అగ్నికణము; మిణుఁగురు

## స్ఫూ

స్ఫూర్తి = సం. అదురుట; తోఁచుట

## స్ఫో

స్ఫోటకము = సం. మశూచికము

## స్మ

స్మయము = సం. ఆశ్చర్యము; గర్వము
స్మరుఁడు = సం. మన్మథుఁడు; మరుఁడు

## స్మా

స్మార్తము = సం. వైదికకార్యము

## స్మి

స్మితము = సం. చిఱునవ్వు

## స్మృ

స్మృతి = సం. బుద్ధి; ధర్మశాస్త్రము; తలంపు

## స్య

స్యందనము = సం. రథము, నీరు
స్యందిని = సం. చొంగ; లాల

## స్ర

స్రగ్వి = సం. పూదండకలవాఁడు
స్రవంతి = సం. నది; ఏఱు; తరంగిణి
స్రష్ట = సం. బ్రహ్మ

## స్రా

స్రావము = సం. కాఱుట

## స్రు

స్రుక్కు = దే. భయపడు; తగ్గు
స్రుతి = సం. కాఱుట

## స్రో

స్రోతస్విని = సం. నది; ఏఱు
స్రోతస్సు = సం. ప్రవాహము; నీరువచ్చెడి తూము

## స్వ

స్వంగము = సం.కౌగిలి
స్వకీయము = సం. తనది
స్వచ్ఛందము = సం. స్వతంత్రము
స్వచ్ఛము = సం. నిర్మలము; తెలుపు
స్వత్వము = సం. హక్కు
స్వనము = సం. శబ్దము; ధ్వని
స్వపనము = సం. నిద్ర
స్వప్నము = సం. కల
స్వభువు = సం. విష్ణువు; శివుఁడు
స్వయంవరము = సం. పెండ్లికూఁతురు తనంతటఁ మగని వరించుట
స్వరము = సం. కంఠధ్వని; అచ్చు
స్వరువు = సం. పిడుగు; యజ్ఞము
స్వర్గము = సం. దేవలోకము
స్వస్థము = సం. నెమ్మది

స్వస్తి = సం. శుభము
స్వస్తిముఖుఁడు = సం. బ్రాహ్మణుఁడు

**స్వా**

స్వాంతము = సం. మనస్సు; గుహ
స్వాగతము = సం. సుఖముతోడిరాక; కుశలప్రశ్నము
స్వాదనము = సం. తినుట; పానము
స్వాదిష్ఠము = సం. మిగులమధురమైనది
స్వాదువు = సం. తీయనిది; ఇంపైనది
స్వాభావికము = సం. పుట్టుకతోవచ్చినది
స్వామ్యము = సం. హక్కు; సొంతము
స్వారస్యము = సం. రమ్యము
స్వార్థము = సం. తనమేలు

**స్వీ**

స్వీకరించు = సం. గ్రహించు; అంగీకరించు
స్వీకారము = సం. అంగీకారము; దత్తు

**స్వే**

స్వేదము = సం. చెమట

**స్వై**

స్వైరత్వము = సం. స్వాతంత్ర్యము
స్వైరిణి = సం. అంకుటాలు; జారిణి
స్వైరుఁడు = సం. స్వతంత్రుడు; సోమరి

**హా**

హాండ = సం. మట్టితొట్టి
హంస =అంచె; పరమాత్మ; యోగి
హంసకము = సం. కాలి అందె
హజారము = దే. ఆస్థానమండపము
హఠము = సం. పట్టు; బలత్కారము
హత్య = సం. చంపుట
హయగ్రీవుఁడు = సం. విష్ణువు
హయము = సం. గుఱ్ఱము; అశ్వము
హరి = సం. విష్ణువు; పచ్చనిది; కోతి; కప్ప
హరిణము = సం. జింక
హరిత = సం. ఆకుపచ్చనిది
హరిద్ర = సం. పసుపు
హరిప్రియ = సం. లక్ష్మి; తులసి; భూమి; ఏకాదశి
హరుఁడు = సం. శివుఁడు
హర్షము = సం. సంతోషము
హలము = సం. నాఁగలి
హవము = సం. యజ్ఞము; ఆజ్ఞ
హవ్యవాహనుఁడు = సం. అగ్ని
హస్తి = సం. ఏనుగు

**హో**

హాటకము = సం. బంగారము; హిరణ్యము
హాయనము = సం. కిరణము; సంవత్సరము
హాలాహలము = సం. ఒకవిషము

**హి**

హితుఁడు = సం. హితవు చెప్పువాఁడు
హిమము = సం. మంచు; చల్లనిది; చందనము
హిమాంశువు = సం. చంద్రుఁడు
హిరణ్యము = సం. బంగారము; ధనము; గవ్వ; రేతస్సు

**హు**

హుంకారము = సం. హుమ్మనుట
హుతాశనుఁడు = సం. అగ్ని

## హృ

హృతి = సం. హరించుట
హృదయంగమము = సం. మనసున కింపైనది
హృషీకేశుఁడు = సం. విష్ణువు

## హె

హెచ్చు = దే. అధికము

## హే

హేతువు = సం. కారణము
హేమంతము = సం. మంచుకాలము
హేమము = సం. బంగారము
హేయము = సం. రోఁత
హేల = సం. విలాసము; తిరస్కారము
హేళనము = సం. పరిహసించుట; తిరస్కరించుట

## హై

హైమవతి = సం. పార్వతి; ఆకాశగంగ

## హొ

హొయలు = దే. విలాసము

## హో

హోమము = సం. దేవయజ్ఞము; మేలిమి

## హ్ర

హ్రదము = సం. మడుగు
హ్రస్వము = సం. పొట్టి; కుఱుచే

## హ్రా

హ్రాదిని = సం. వజ్రాయుధము; ఏఱు; మెఱపు

## క్ష

క్షంత = సం. సహించువాఁడు
క్షంతవ్యము = సం. క్షమింపదగినది
క్షణభంగురము = సం. అశాశ్వతము
క్షణము = సం. సమయము; ఘటికయందు ఆఱవభాగము
క్షణిక = సం. మెఱపు
క్షణికము = సం. తెప్పపాటుకాలము; క్షణకాలముండునది
క్షతజము= సం. రక్తము; చీము
క్షతము = సం. గాయము; కొట్టబడినది
క్షతి = సం. గాయము; నాశము
క్షత్రము = సం. శరీరము; నీరు; ధనము
క్షత్రియ = సం. క్షత్రియ స్త్రీ
క్షత్రియాణి = సం. క్షత్రియ
క్షత్రియుడు = సం. క్షతమునుండి రక్షించువాఁడు
క్షప = సం. రాత్రి; రేయి
క్షపణకుఁడు = సం. బౌద్ధమతస్థుఁడు
క్షపాకరుఁడు = సం. చంద్రుఁడు
క్షపాచరుఁడు = సం. రాక్షసుఁడు
క్షమ = సం. ఓర్పు; భూమి
క్షమము = స. యుక్తము; చాలునది; తగినది
క్షమాపణము = సం. క్షమింపవేఁడు కొనుట
క్షముఁడు = సం. సమర్థుఁడు
క్షయము = సం. తగ్గుదల; క్షయరోగము
క్షయించు = సం. తగ్గు; క్షీణించు
క్షరము = సం. నశించునది; మేఘము

## క్షా

క్షాంతి = ఓర్పు; భూమి
క్షాత్రము = సం. పౌరుషము; క్షత్రియ ధర్మము
క్షామము = సం. కఱవు
క్షారము సం.= ఉప్పు; కారము; గాజు
క్షాళనము = సం. కడుగుట
క్షాళితము = సం. కడుగబడినది

## క్షి

క్షితి = సం. భూమి
క్షితిధరము = సం. కొండ
క్షితిపతి = సం. రాజు
క్షితిరుహము = సం. చెట్టు
క్షిప్తము = సం. త్రోయబడినది
క్షిప్రము = సం. శీఘ్రము; వడిగలది

## క్షీ

క్షీణము = సం. కృశించినది; తగ్గినది
క్షీబుఁడు = సం. మద్యపానమత్తుఁడు
క్షీరకంఠుఁడు = సం. బాలకుఁడు
క్షీరగ్రాహి = సం. శిశువు; హంస
క్షీరము = సం. పాలు; నీరు
క్షీరాన్నము = సం. పాయసము
క్షీరాబ్ధి = సం. పాలసముద్రము

## క్షు

క్షుణ్ణము = సం. పొడిచేయబడినది; అభ్యసింపబడినది
క్షుత్తము = సం. తుమ్ము
క్షుత్తు = సం. ఆకలి; తుమ్ము
క్షుద్రము = సం. అల్పము; నింద
క్షుద్రుడు = సం. అల్పుఁడు; లోభి
క్షుధ = సం. ఆఁకలి; క్షుత్తు
క్షుధితము = సం. ఆఁకలిగొన్నది
క్షుభితము = సం. క్షోభపెట్టబడినది
క్షురకర్మ = సం. క్షౌరము
క్షురి = సం. మంగలి; క్షౌరకుఁడు
క్షురిక = సం. మంగలికత్తి

## క్షే

క్షేత్రజ్ఞుడు = సం. జీవుఁడు; నేర్పరి; సేద్యకాఁడు
క్షేత్రపాలుఁడు = సం. పొలముకాపరి, భైరవుఁడు
క్షేత్రము = సం. భూమి; భార్య; పుణ్యస్థలము
క్షేపము = సం. చిమ్ముట; ప్రేరణము
క్షేమ = సం. పార్వతి
క్షేమంకరుఁడు = సం. మేలుచేయువాఁడు
క్షేమము = సం. శుభము

## క్షై

క్షైణ్యము = సం. నాశనము
క్షైరేయము = సం. క్షీరసంబంధమైనది

## క్షో

క్షోణి = సం. భూమి; మొలత్రాడు
క్షోదము = సం. పొడి; దంచుట
క్షోభము = సం. దుఃఖము; కలఁత
క్షోభించు = సం. కలతపడు

## క్షౌ

క్షౌద్రము = సం. నీరు; తేనె; నీచత్వము
క్షౌద్రేయము = సం. మైనము

## క్ష్మా

క్ష్మా = సం. నిద్ర; భూమి
క్ష్మాజము = సం. చెట్టు; వృక్షము
క్ష్మాధరము = సం. కొండ
క్ష్మాపతి = సం. రాజు

## క్ష్వే

క్ష్వేడ = సం. సింహనాదము; పెడబొబ్బ
క్ష్వేడము = సం. విషము; ధ్వని; చెవుడు
క్ష్వేళ = సం. సింహనాదము
క్ష్వేళము = సం. విషము
క్ష్వేళితము = సం. సింహనాదము